# Andhra Granthalayam

*A Bilingual Quarterly Library Journal*

*Volume 1* *September 1939* *Number 1*




*

సంచార గ్రంథాలయాలు

అమెరికాదేశ గ్రంథాలయము

గ్రామ గ్రంథాలయసేవ

*

*

The Heart of a University

A Survey of Classification

Spiritual Experience and Mysticism

*

*Editor :*

**P. Rajasekharam,** *B. A., B. Ed., Dip. Lib.*

## Andhra Desa Library Association

*Office*: **Patamatalanka (Via) Bezwada, S. India.**

# ఆంధ్రగ్రంథాలయం

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పక్షమున వెలువడు

సచిత్ర త్రైమాసిక పత్రిక




సంపుటము ౧    సెప్టెంబరు 1939    సంచిక ౧

సంపాదకుడు

పుణ్యమూర్తుల రాజశేఖరం, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.



విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ
కీ. శే. శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు

ఆంధ్రుల సర్వతోముఖ వికాసము కొరకు
తమ సర్వస్వము నర్పించి యావజ్జీవము కృషిసల్పిన
స్వర్గీయ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి
జ్ఞాపకార్థము

*In memory of*
*Late* Mr. K. Nageswara Rao Pantulu,
*the great benefactor of the Andhras*

# విషయసూచిక (Contents)



# చిత్రములు (Illustrations)

ఆంధ్రగ్రంథాలయం

సంపుటము ౧ | సెప్టెంబరు 1939 | సంచిక ౧

# Why, What, How?

*By* S. R. RANGANATHAN, *M. A., L. T., F. L. A.,*
*Librarian, Madras University Library &*
*Secretary, Madras Library Association.*

My heart is filled with joy when I see the irrepressible enthusiasm, resource and faith of my young colleagues of the Andhra Desa. Their devotion to the library cause appears to be unbounded. The **Andhra Granthalayam** is the latest manifestation of their spirit of venture. I wish it every success.

NEWS AGENCY

It has a three-fold function. It has first to be a medium for dissimination of library news. Each library stands to gain by knowing what happens in the sister libraries of the country. Imitation and emulation are most powerful factors in advancement. They enable everybody to share the fruits of the creative activity of the few who alone may be endowed with capacity for it. The net for the news may be made world-wide, provided editorial art will relate the news received to the conditions of our country in an assimilable form.

LIAISON WORK

This new venture can also be a reliable liaison between the hundreds of libraries-large and small-scattered throughout the land and the limbs of government which have to foster them, while the specific needs of individual libraries must be attended to only individually, it is possible to find out their common factor, so to speak. Here again it is up to editorial art to shape that common factor into a principle or policy for consideration by authorities. The library profession and the lay people who are interested in the library cause should use the pages of this periodical as arena for discussion of principles and policies.

THE MOST VITAL FUNCTION

Lastly, this new venture should function also as an organ for the forging of the technique of librarianship. Librarianship is no longer mere artisanship dependent on rule of thumb. It is a science. Its roots reach a few fundamental principles in which all the library practices-past, present and future-lie in a potential form. It is the duty of library science to make the potential manifest with the aid of what has been called scientific method. Observation, experiment, induction, deduction and generalisation are the recognised elements of such a method. Library Science is amenable to treatment in all these ways. This organ should enunciate from time to time specific problems that require investigation. Individual libraries that have the necessary facilities should experiment, observe and communicate their findings. The publication of such findings in this organ will lead to the necessary induction and deduction. Up to this point many can and should contribute. The last stage, generalisation, is usually extra intellectual. It lies largely within the sphere of intuition. But intuition functions only in the few.

The Lord says[1],

"मनुष्याणां सहस्रेषु कश्चिद्यतति सिद्धये ।
यततामपि सिद्धानां कश्चिन्मां वेत्ति तत्वतः ॥

*Among thousands of men one here and there strives after perfection, and of those who strive and attain perfection one here and there knows me in all the principles of my existence.*"

We have no means of finding out who the few are. But all the work up to generalisation must be done intensely, profusely and persistantly to facilitate the work of the few. They will appear at the right moment. I wish the **Andhra Granthalayam** every success in this last, but most vital, function.

COMPLEMENTARY FUNCTIONING

Before concluding, I should like to say a few words as Secretary of the Madras Library Association. I am happy to realise that, in this new venture of my Andhra colleagues, the Andhra Desa Library Association and the Madras Library Association work in a most harmonious and complementary way. The latter discharges these three functions in a different way. The first two functions are discharged through its annual reports,

---

[1] The Gita Chapter 7. Verse 3.

and bibliographical series. The last function is being steadily fulfilled by its publication series. In that series, an attempt is being made to build up library science in a systematic way. The foundation for this work was laid in visits to hundreds of libraries and is being built upon with the aid of the vast collection of the Madras University Library, which affords ample opportunity for observation. These items of work make the hands of the Madras Library Association quite full. The running of a library periodical came up several times but it had to be given up as being more than what could be done now with comfort and efficiency. Hence, when the editor of this organ explained his plans, I was glad that Providence was working in a way which was perfect. I pray that this complementary move of the two Associations may get more and more perfectly articulated and lead step by step to the concrete realisation of our most cherished wishes for the library future of our motherland.

---

# సంపాదకీయం

"*Indeed, unless a man can link his written thoughts with the everlasting wants of men, so that they shall draw from them as from wells, there is no more immortality to the thoughts and feelings of the soul than to the muscles and the bones*".

— HENRY WARD BEECHER

## ఆంధ్రగ్రంథాలయోద్యమం

హిందూదేశంలో ఆధునికాశయాలతో గ్రంథాలయోద్యమం సాగించడానికి ముందంజవేసింది బరోడాసంస్థానం. దీనిని మొట్టమొదట అనుకరించినది ఆంధ్రదేశం. బరోడాసంస్థానంలో పూర్తిగ ప్రభుత్వపోషణ ఉంది. ఆంధ్రదేశంలోని ఉద్యమం ప్రజల ఆదరణమీదే నడిచింది—ఇంకను అలాగే నడుస్తోంది. అయితేనేమి ఆంధ్ర గ్రంథాలయోద్యమం చేసినసేవ అపారం: బరోడాసంస్థానంలోని గ్రంథాలయోద్యమం ఆదర్శంగా తీసికొని, అమెరికా యూరపు దేశాలలోని ఉద్యమతత్వాన్ని అవగాహన చేసికొని పల్లెలందు పట్టణాలలోను గ్రంథాలయాలు, గ్రంథాలయసంఘాలు స్థాపించి వాటిద్వారా విజ్ఞానబీజాలను విరివిగా వెదజల్లింది; సభలుజరిపి, ఉపన్యాసాలిప్పించి పత్రికలలో వ్యాసాలువ్రాయించి, వార్తలు ప్రచురింపజేసి గ్రంథాలయప్రబోధం చేసింది; రాత్రిపాఠశాలలను నడిపి, వేసగిపాఠశాలలను ఏర్పాటుచేసి వయోజన విద్యకు సహాయపడింది; జాతీయోద్యమానికి త్యాగమూర్తులను తయారుచేసింది;

ఆంధ్రోద్యమానికి పట్టుగొమ్మై నిలిచింది; గ్రంథాలయాలకు పంటభూమి అని చెప్ప దగిన అమెరికాతో పోలిక తెచ్చుకొంది. ప్రజాదరణమీదే నిలిచి ప్రబలడంలో అన్ని దేశాలకు సవాలంటోంది!

## గ్రంథాలయసర్వస్వం

ఆంధ్రగ్రంథాలయోద్యమవ్యాప్తికోసమే 1915వ సంవత్సరంలో 'గ్రంథాలయ సర్వస్వం' అనే త్రయిమాసిక పత్రిక నొకటి స్థాపించారు. 1918 వ సంవత్సరములో మూడవ సంపుటమునుండి సంవత్సరమున నాలుసంచికలవంతున ప్రకటింపబడినది. ఆంధ్రదేశగ్రంథాలయ తత్వాన్ని భారతవర్షమున కంతకును చాటుటకై మూడవ సంపుటమునందు ఆంగ్లేయభాగమునుకూడ చేర్చుటకై నిర్ణయించారు కాని మూడవ సంపుటమందలి సంపాదకీయములో ఆ విషయమేమీ గోచరింపలేదు; అట్టి ఆంగ్ల భాగమును ప్రచురించినట్లు నాకెక్కడ కనపడనూలేదు. అక్కడక్కడి సంపాదకీయా లనుబట్టి చూస్తే గ్రంథాలయములు, గ్రంథాలయాభిమానులు పత్రికకు తగిన ప్రోత్సాహ మివ్వకపోవడమే కారణమని తోస్తుంది. 1923 లో ఆరవసంపుటమునుండి 'గ్రంథాలయసర్వస్వము' మాసపత్రికగా వెలువడింది.

గ్రంథాలయసర్వస్వం చేసిన సేవ కడు శ్లాఘనీయం: గ్రంథాలయశాస్త్రం, ఆంధ్రవాఙ్మయం, ఆంధ్రాభ్యుదయాని కనుకరించే యింకా అనేకవిషయాలనుగురించి అనుభవజ్ఞులచే వ్రాయబడిన వ్యాసాలు ప్రకటించి విజ్ఞానవ్యాప్తికి తోడ్పడింది; గ్రంథాలయసంఘాల నివేదికలు, వృత్తాంతములు ప్రకటించి గ్రంథాలయోద్యమానికి సేవచేసింది; గ్రంథవిమర్శలను ప్రచురించి గ్రంథాలయాలకు ఉత్తమగ్రంథములేర్చు కొనడానికి దారి చూపింది. గ్రంథాలయ భవనములయొక్క, గ్రంథాలయ సభల యొక్క, గ్రంథాలయ సేవకులయొక్క పటాలను, ఆంధ్రాభ్యుదయ బోధకములగు చిత్రములను ముద్రించి ఎన్నో విషయాలను కళ్ళకు కట్టినట్టు చేసింది.

ఈ పత్రికను, ఆంధ్రగ్రంథాలయోద్యమాన్ని అల్లారు ముద్దుబిడ్డగా పోషించి పెంచిన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారే 1938 వరకు అష్టకష్టాలు పడి, బాలారిష్టాలు దాటించి నిర్వహించారు. ఏ సంవత్సరం చూచినా పత్రికమీద నష్టమేకాని నిలవ చిక్కలేదు. పత్రికలు తీసుకొనేవారు ఎక్కువ, చందాలిచ్చేవారు తక్కువ అయారు. వేడినీళ్ళ అనుపానంతో తీసికోమని మందిస్తే ఆ వేడినీళ్ళుకూడ నీ సంచిలోనే ఉన్నాయేమొ చూడునాయనా అందట—ఒకముసలమ్మ. గ్రంథా లయసర్వస్వం గతి అలా దిగింది. ఏదోవిధంగా తంటాలుపడి పత్రిక ప్రచురిస్తే పంపేటందుకు పోస్టేజికూడ వెంకటరమణయ్యగారే భరించవలసివచ్చింది. ఈ చేతి చమురుభాగవతం ఎన్నాళ్ళు సాగుతుంది. పర్యవసానం పత్రికాపతనమే. పైకి లేవదీసే

టందుకు పట్టిందొక సంవత్సరం! ఇప్పుడైనా గ్రంథాలయాభిమానులు ఆదరిస్తారనీ ఇంటి ఆడపడుచుని అనాథను చేయరని తలుస్తున్నాము.

గ్రంథాలయసర్వస్వ మిప్పు డొక నూతన రూపం దాలుస్తోంది. తెలుగులోనే కాకుండా ఆంగ్లంలోకూడ వ్యాసాలు ప్రచురిస్తుంది. వెనుక మూడవసంపుట మప్పుడు తలపెట్టిన ఆంగ్లభాగప్రచురణ ఫలోన్ముఖం చేయాలనీ 'ఇండియను లయ్బ్రరీజర్నలు' లేని లోపం తీర్చాలనీ సంపాదకీయవర్గంవారి అభిప్రాయం. అయితే ఆంధ్రదేశములోని పల్లెటూరి గ్రంథాలయాలకు ఒక అవకాశం కల్పించదలచుకొన్నాము. వారు ఆంగ్ల భాగానికి వేరే రుసుము చెల్లించకుండానే సప్లయిచేస్తాము. ఇప్పుడు పల్లెలలోకూడ ఇంగ్లీషు చదువుకున్నవారుంటున్నారు. వారాభాగములోఉండే అంశాలు చదువుకో వచ్చు; చదివి ఇతరులకు చెప్పవచ్చు. ఆంగ్లవిద్యాధికులకు సదుపాయం, అక్కరలేని వారలకు నిరపాయం.

## ఆంధ్రగ్రంథాలయం

గ్రంథాలయ సర్వస్వాన్ని ఆంధ్రగ్రంథాలయోద్యమవ్యాప్తికొఱకు ఉద్దేశించ డంచేత 'ఆంధ్రగ్రంథాలయం' అని పేరుకూడ మార్చడానికి సంపాదకీయవర్గంవారు ఏర్పాటుచేశారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవారు ఈయేర్పాటు నేకగ్రీవంగా అంగీకరించారు. 'గ్రంథాలయసర్వస్వం' ఆగిపోయిననాటికి 11 సంపుటాలయాయి. కాని 'ఆంధ్రగ్రంథాలయం' అనేపేరు క్రొత్తదికావడంచేత సంపుట సంఖ్యను తిరిగి ప్రారంభించవలసివచ్చింది.

## దేశోద్ధారకుని స్మారకచిహ్నం

ఈ సంచికను కీర్తిశేషులు శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి జ్ఞాపకార్థం ప్రచురించి చంద్రునికొక నూలుపోగన్న సామ్యమున ఆ విశ్వదాతకు ఈమాకృతజ్ఞతాచిహ్నము నర్పించుకొనుచున్నాము. గ్రంథాలయోద్యమవ్యాప్తికి ఆయనచేసిన సేవ అనుకరణీయ సాధ్యంకానిది: ఆంధ్రపత్రికను, భారతిని, ఆంధ్రగ్రంథ మాలలోని పుస్తకాలను ఎన్నెన్నో గ్రంథాలయాలకు ఉచితంగా ఇచ్చి పోషించారు; స్వార్థంవదలి తమ ఖర్చులతో వెళ్ళి గ్రంథాలయసభల కధ్యక్షతవహించి, చక్కని ప్రబోధం గావించి, విరాళాలిచ్చి గ్రంథాలయోద్యమానికి తోడ్పడ్డారు. గ్రంథాల యోద్యమ వార్తలకు తమ పత్రికలో ప్రాముఖ్యత ఇప్పించి గ్రంథాలయాభిమాను లకు, ఉత్సాహం కలుగచేశారు. ఆంధ్రవాఙ్మయ సూచికను ప్రకటించి గ్రంథాలయా లకు, పరిశోధకులకు వాఙ్మయనేత్రాలు కల్పించారు. ఎందరెందరో విద్యార్థులకు, కవులకు, నిరుద్యోగులకు వారుచేసిన సహాయం ఆంధ్రలోక మెఱుగనిదికాదు. ఆంధ్రాభ్యుదయంకోసం యావజ్జీవం ధారవోసిన ఆదేశోద్ధారకుని విషయంలో ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘంవారు ఈచిరుచిహ్నంతో తృప్తిపొందక 'దేశోద్ధారక కేంద్ర

గ్రంథాలయం' స్థాపించి ఆకళాప్రపూర్ణుని ఆత్మకు ఆనందంకలుగజేస్తే ఆంధ్రదేశానికి కెంతో గౌరవం తెచ్చిన వారవుతారు.

## ప్రభుత్వపోషణ

నేడు హిందూదేశంలో గ్రామజీవనమెంతో అధోగతిపాలైపోయింది: దురభ్యాసాలు, దుర్వ్యసనాలు, తగాదాలు, తంపెలు, ప్రాముఖ్యతకోసం పలుకుబడికోసం దూబరాఖర్చులు, అధికార్లకు లంచగొండితనం నేర్పడం, అమాయికులనోట దుమ్ముకొట్టించడం, ఎన్నికలలో జూపే ఎబ్బెరికం, అవినీతిప్రవర్తన—ప్రస్తుత గ్రామజీవనంలో ప్రధానాంశములుగా ప్రబలుతున్నాయి. దీనికంతా కారణం అజ్ఞాన ప్రాబల్యతని వేరే చెప్పనక్కరలేదు. ఈ అజ్ఞానాన్ని పారదోలాలంటే ప్రతి గ్రామంలోను ఆధునిక పద్ధతుల ననుసరించి గ్రంథాలయాలు, పఠనమందిరాలు ఏర్పాటుచేయాలి. ఇది ధనంతోకూడుకొన్న పని; త్యాగబుద్ధులు, ఉదారమనస్కులు చేపట్టి చేయవలసిన కార్యం; ప్రభుత్వం పూనుకొని సాగించవలసిన సదుద్యమం.

పశ్చిమఖండాలలో గ్రామ గ్రంథాలయోద్యమం అగ్రస్థానం వహిస్తోందంటే 'కార్నిజీ' మొదలుగాగల ఉదారపురుషుల సహాయం, ప్రభుత్వపోషణ, తగిన కట్టుదిట్టాలతో ప్రభుత్వంచేసిన చట్ట నిర్మాణం కారణాలు. మనదేశంలో కార్నిజీలాంటి ఉదారపురుషులకు కొదువలేదు. గ్రంథాలయోద్యమానికి విశ్వదాతచేసిన సహాయం చిరస్మరణీయంగదా. శ్రీయుత వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు ఆంధ్రదేశమునస్థాపింపబడు ప్రతిమండల గ్రంథాలయానికి తమచే ప్రకటింపబడిన 600 రూప్యముల విలువగల గ్రంథ సముదాయమును ఉచితముగా నిచ్చుటకు వాగ్దానంచేయడం, ముందు ప్రకటింపబోవు వానినికూడ తా మొసగుట కభ్యంతరములేదని నుడువుట గ్రంథాలయ ప్రపంచానికి తెలియనివిషయంకాదు; కొందరు కవులుకూడ వీరిననుకరించెదమని వాగ్దానంచేశారు. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘాని కొక స్థిరవసతి నేర్పాటు చేయవలెనని తలపెట్టగా శ్రీ కొమ్మా సీతారామయ్యగారు రు 1000/-లు విరాళమిచ్చారు. ఈవిధంగా ఎందరెందరో దాతలు గ్రంథాలయోద్యమానికి సహాయంచేస్తున్నారు. కాని ఈసహాయాన్నంతను సమకూర్చి సరియైన మార్గాలలో గ్రంథాలయోద్యమాన్ని సాగించే ప్రభుత్వం కనబడటంలేదు! ప్రభుత్వం తలపెట్టి బందోబస్తుగా నడపకపోతే ప్రజల సహాయం బూడిదలో పోసిన పన్నీరు సామ్యమవుతుంది. తెలిసినవారు తెంపుచేసికొని గ్రంథాలయోద్యమవ్యాప్తికోసం చట్టము తయారుచేస్తే తొందరపడి త్రోసి వెనుకకు నెట్టారు—మన మదరాసుప్రభుత్వంవారు—ప్రజలమీద పన్నులు వేయడానికి భయంచేత, మరొకవిధంగా పోషించేటందుకు చేతకాకపోవడంచేత. 1914 వ సంవత్సరంలో ప్రారంభించి ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం సాగించి హిందూదేశమందన్ని ప్రాంతాలకు దారి చూపెట్టిన ఆంధ్ర

గ్రంథాలయోద్యమానికి ఇంతవరకు ప్రభుత్వ ప్రోత్సాహం లేకపోయె! 1926 వ సంవత్సరంలో శ్రీ కొండా వెంకటప్పయ్యగారి పుణ్యమా అంటూ మదరాసు రాష్ట్రంలోని గ్రంథాలయాలకు ప్రభుత్వం కొంత విరాళ మనుగ్రహించింది. ఆ విరాళం సగటున గ్రంథాలయానికి ఒక రూపాయకూడ లేదు. పోనీ ఆ విరాళంతో కొన్ని గ్రంథాలయాలైనా బాగుపడతాయేమో అంటే రానురాను తగ్గించేశారు. ప్రజాప్రభుత్వం వచ్చింది. తరవాతేదనుకొంటే పూర్తిగా ఇయ్యడం మానేశారు— కాంగ్రెసు ప్రభుత్వం. జనసామాన్యమందు విద్యావ్యాప్తికి, జాతీయ వికాసానికి, గ్రామసౌభాగ్యానికి గ్రంథాలోద్యమమే శరణ్యమని గంభీరంగా ఉపన్యాసాలివ్వడమే కాని, ఒక్క శాసనసభా సభ్యునకైనా పట్టుదలతో పనిచేసి ప్రభుత్వంచే విరాళ మిప్పించి, తగిన చట్టనిర్మాణాన్ని ఏర్పాటుచేయించి, గ్రంథాలయోద్యమాన్ని ఉద్ధరించాలనే విషయం గోచరిస్తూన్నట్టు కనపడదు. గట్టిగా మాట్లాడితే మద్యపాన నిషేధంవల్ల డబ్బుపోతోంది, గ్రంథాలయోద్యమానికికూడా డబ్బెక్కడ తీసుకొనిరాము అంటారు. జ్ఞానం కలిగితే మద్యపానం నిషేధించాలనేసంగతి దానంతటదే కలుగదూ? పొట్టశుద్ధికలిగిన ప్రజలలో త్రాగు డెంతవరకుందో పరీక్షించండి. సామాన్య విద్యావంతులలో సరిగా చూస్తే త్రాగుడున్నట్టు తోచదే. ఆంగ్లవిద్యాధికులైన అధికారగర్వులలోను, వారి ననుకరించే ఐశ్వర్యమత్తులలోను, నిరక్షరాస్యులైన కష్టజీవులలోను మాత్రమేకదా త్రాగుడు ప్రబలి ఉన్నది. తెలిసియు తెలియని అధికారగర్వులకు బుద్ధిచెప్పడానికి బ్రహ్మతరంకూడ కాదు. వారి సంగతి మన కవసరమూలేదు. నిరక్షరాస్యులైనవారిని అక్షరజ్ఞానులను చెయ్యండి; జ్ఞాన ప్రబోధం గావించి వారిచే జ్ఞానామృతాన్ని త్రాగిస్తే మద్యపానాన్ని మరుసటి నిమిషంలో మరచిపోరూ? నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమం, వయోజనవిద్యాభివృద్ధి మన మదరాసురాష్ట్రంలోనే ఇటువంటి దీనావస్థలో ఉన్నదికాని సంయుక్తరాష్ట్రాలు, మధ్యరాష్ట్రాలు, బొంబాయి, సింధు, ఒరిస్సారాష్ట్రాలు ఏవిధంగా చేస్తున్నాయో చూడండి! మన బండారమప్పుడు బయటపడుతుంది! శాసనసభాసభ్యుల కొక మనవి— శుష్కప్రియాలనుచెప్పడం మాని, కార్యరంగంలోకి దిగండి; విజ్ఞానవ్యాప్తికి విరాళాలిప్పించండి; గ్రంథాలయోద్యమాన్ని గట్టెక్కించండి. మరల ఎన్నికలు వచ్చేటప్పటికి దూబరా ఖర్చులమీద, దుర్మార్గ ప్రవర్తకులమీద, దుష్ప్రచారంమీద ఓట్లకొరకు ఆధారపడక జ్ఞానామృతంచే శుద్ధిచేయబడిన వోట్లకోసం ఎదురు చూడండి!

# అందరికీ పుస్తకాలు !

కీర్తన

అందరకు పుస్తకాల్ - అంధులకు పుస్తకాల్
పిల్లలకు పెద్దలకు - ఎల్లరకు పుస్తకాల్ ॥అం॥

౧. నారీమతల్లులకు - నోర్లేనివారలకు
కలవారలకు - లేని కటికబీదలకును ॥అం॥

౨. పనిలేకతిరిగేటి - పట్టణవాసులకు
పగలెల్ల పాటుబడు - పల్లెజనమునకెల్ల ॥అం॥

౩. పేటలో గ్రంథాలు - కోటలోగ్రంథాలు
బాటలోగ్రంథాలు - బోటులోగ్రంథాలు ॥అం॥

౪. స్వేచ్ఛగా తిరిగేటి - స్వచ్ఛందవాదులకు
ఖైదులోమ్రగ్గేటి - ఖైదీలతోసహా ॥అం॥

౫. రోగములతోకుళ్ళు - రోగిష్ఠులకెగాక
శారీరమునమంచి - ఆరోగ్యమున్గల్గు ॥అం॥

౬. చదువనేర్చినయట్టి - చదువజాలనియట్టి
పండితపామర - మండలికి నంతాను ॥అం॥

**'Books for All'** is the title of this inspiring song. The several trends of this revolutionary slogan of the Modern Library Democracy are indicated in these lines, *Cf.* The Chorus of the Modern Library Movement— P. 141. *Five Laws of Library Science* by S. R. Ranganathan.